చిట్టి - (గారంగా) వస్తయ్ లే! యేది, ఇటుచూడు ఆc! ఆc !
అదిగో వచ్చులే వచ్చు పాడు.

సీత - పాటః- సందమామాలోనే - సక్కని సీ, సీడ

సూచుకోరా ! రాజా! సూసుకోరా, ॥సం॥
సల్లాని ఎన్నెల్లో - సంపొద్దు ఏల కాడ
బాటపక్క తోటలోకి! నా రాజా!
సాలుగా ఎల్దామా - నారాజా ॥సం॥

చిట్టి - అమ్మో ! రాదన్నావే యికనువ్వు రికాడ్డు యివ్వొచ్చు కమలాంబో.

సీత - అసలు యీపాట యిందులోకి ఎట్టావస్తాదిబాబూ !

చిట్టి - (తెల్లబోయి తటపటాయించి) ఎట్టావస్తాదా! వస్తందిలే వస్తది మరేం అన్నిబాసలు వచ్చినోడ్ని ఒకడ్ని చంపి యిందులో కూర్కోబెడతారు. మరతిప్పగానే యిక వాడెట్టా వాగమంటే అట్టావాగుతాడు

సీత - అమ్మో చచ్చినోడెట్టా మాట్లాడుతాడు బాబూ.

చిట్టి - అట్టాఅనుగు బిడియపడితే ఎట్టా! రా! యిట్టారా।

సీత - (దగ్గరకు వస్తుంది)

చిట్టి - చూడు (కీరాడ్డుచూపి) యిదేంటో తెలుసా యిదే కీరాడ్డంటే యిది తిప్పగానే ఆడు ..ఎవడూ! యీ పెట్లో వాడు వూపిరోసుకోని కంఠం విప్పుతాడు. (రికార్డుచూపి) యిక యిదేంటో తెలుసా ! యిదేc ! రికాడ్డంటే దీనికి

కిందాపైనా అచ్చురాలుంటైలే అయ్యో ఏబాసలో వుంటే ఆ బాసలో పాడతాడు

సీత - కనపడవేం బాబూ!

చిట్టి - అయ్యో మనకగపడవులే ఆడికే ఆగపడ్తై సరేవిను (సొండుబొక్సు చూపి) ఇదేంటో తెలుసా యిదే గోంద్రు బొక్సంటే దీంట్లో ఒకపురాడుంటది అనూహెట్టి ఆడిసి పొడవాలి.

సీత - పొడవటం ఎందుకు బాబూ!

చిట్టి - ఆడు లేకటానికిలే ఆ దెబ్బ ఆడు లేచి కంఠంయిప్పి ఒక పాడటం పాడతాడు కమళాంబా అపినా ఆగడనుకో (చేతులు సీత బుజములమీద వేస్తాడు)

సీత - (చేతులు తీసివేసి బిడియంతో వక ప్రక్కకు పోవును)

చిట్టి - పిచ్చిపిల్లా! పిచ్చిపిల్లా! నీకేం తెలవదనుకుంటానే అసలే గొడవా తెలవదా? (చేయివళ్లా వేస్తాడు)

సీత - చాల్లే ఇక కట్టిపెట్టు దూరంగావుండి మాట్లాడు పెండ్లి కావలసిన పిల్లను.

చిట్టి - ఇదిగో, ఇదిగో, ఏమన్నా ఏమన్నా! పెల్లికాదని భయమా! అయినా వక ఎధవ చేసుకనేదేంటి అంతవరకూ వస్తే ఆకొమ్ము నేనే కాస్త (తలవంచుతాడు)

సీత - (రెండో వైపుకు వెల్తుంది)

చిట్టి - సీతారత్నమా! సీతారత్నమా! మాటంటె తప్పేటోణ్ని కాదు అన్నానేంటో అన్నా! పమాణవూర్తిగా నిన్నే చేసు

కుంటూ యీ భూగోళం సాచ్చిగా నిన్నే చేసుకుంటా (మో కరిల్లును)

సీత – ఛీ, పశువా! (గట్టిగా చెంపమీద కొట్టి, నీకంటే గొడ్లు నయం నీ ముఖం చూచినా పాపం.

చిట్టి – (దవడ ఒక చేతితో సవరించుకొంటూ) ఏంటెంటి యీ మోటసరసం ఇంతగట్టిగా కొట్టుకుంటా రేంటెక్కడన్నా.

సీత – మనిషివా! నీకు నావంటి అప్పచెల్లెల్లు లేరు.

చిట్టి – (కోరచూపు మూస్తాడు)

సీత – ఏమిటా(అట్టా చూస్తావ్ నిన్నే రా! (బుగ్గమీదపొడుచు)

చిట్టి – ఇదిగో మాటలు మిగులుతున్నావు ఒరే గిరే అంటే బాగుండదు, ఏమనుకున్నావో.

సీత – మరేమనాలిరా నిన్ను.

చిట్టి – అదిగో, అదిగో, అదేవొద్దన్నా! నువ్వు చేసుకోపోతే చేసుకోపోయాను గాని ఒరే, గిరే, అంటా వేంటి

సీత – ఏమిటా(నిన్ను చేసుకొనేది.

చిట్టి – అయినా దాందేముస్నదితే! కమలాంబా! నువ్వనా వొచ్చు, నేపడా నచ్చు, సంసారమయ్యే ఇవ్వాలేదో మన విషయం తేలిపోవాలి (కెంబడిస్తాడు)

సీత – (అటూ ఇటూ తప్పించుకొంటూ దిండ్లువగైరాలు విసురుతూ వుంటుంది)

రంగన్న – (లోనుండి) బాబూ! బాబూ!

చిట్టి - ఎవ్వడో శా నుప్పు యిప్పుడు శొనాపు మీదవున్నాను.

రంగన్న - నేను బాబూ! రంగడిని తలుపుతియ్యండి

చిట్టి - (ఉలికిపడి) ఒరేయి రంగడూ నువ్వు చిగిరెట్లు తెచ్చావా ఉండు వస్తున్న.

సీత - అయ్యా అయ్యా (ఏడ్చును)

చిట్టి - వుండో అసలు నేనేమన్నా అనానా! ఘాటికే ఏడుస్తా వెందుకే పిచ్చిముండా (బతిమిలాడును)

సీత - (బిగ్గరగా) అయ్యా అయ్యా!

రంగన్న - (తలుపు గట్టిగా కొట్టుచు) చిట్టిబాబూ చిట్టిబాబూ తలుపుతియ్యండి!

చిట్టి - ఆఁ తలుపా తీస్తున్నా ఒరే రంగడూ తొందరపడతా వేమూ ఆలోచించి తొందరపడు అసలేమీ లేదు

రంగన్న - (లోనుండే) వేణుబాబూ వేణుబాబూ

వేణు - (లోనుండే దూరంగా) ఏం రంగడూ ఏమిటి వస్తున్నా

రంగన్న - (లోనుండే)ఒకసారి తొందరగా రండిబాబూ

వేణు - (లోనుండే) ఏమిటి రంగన్నా యీగందరగోళం చిట్టీ తలుపుతియ్యి

చిట్టి - ఎవరూ వేణుగోపాళం నువ్వా నువ్వా వచ్చావా సరే తీస్తున్నా గోపాళమోయ్ నీవుకూడాతొందరపడతావేమో ఏమీ లేదు అసలు నువ్వు ముందుండి ఆడిని ఎనకాల వెట్టు ఇదుగో తీస్తున్నా (తలుపు తీయగా ఇద్దరూ లోపలకు వస్తారు) రా వేణుగోపాళం ఏం మళ్ళావచ్చావు రా కూర్చో

సీత - అయ్యో (ఏడుస్తూ తండ్రి దగ్గరకు వెళుతుంది)

వేణు — అరే ఎందుకూ ఏడుస్తుంది

చిట్టి - పాపం, పుణ్యం, భగవంతుడికి తెలవాలి పొక్కలో నొప్పంట, ఒరే రంగడూ నువ్వెట్టా ఎల్లావో లేదో సొరపడే మందిసిచ్చుకోరా పిచ్చిదవా

వేణు - అసలేమిటి రంగా

చిట్టి — ఏం లేదు లే

వేణు - చా వూరుకో ఏం రంగా

రంగన్న - ఏముంది బాబూ సిగరెట్లు పట్టుకురమ్మని నన్ను బజారు పంపించాడు తిరిగి వచ్చేటప్పటికల్లా తలుపులు వేసున్నై ఎంతసేపు కొట్టినా తియ్యడు ఇక తలా మిమ్మల్ని పిల్చా

వేణు - (చిట్టివంక కోపంగా చూస్తాడు)

చిట్టి - ఏంటి వేణుగోపాళం అట్టా సూస్తావు అసలేటూ లేదంటె

వేణు - ఏం సీతా, యేం జరిగింది.

సీత - (ఏడుస్తూ) మా అమ్మ బజారుకెళ్ళాను. నేను వరండాలో కూర్చున్నాను. ఎవరో చూస్తున్నారు. లోపలకు రమ్మన్నాడు ఎంతో పెద్దమనిషిలాగా.

చిట్టి - ఇందులో తప్పేమున్నా వున్నదా?

వేణు - నువ్వూరుకోవోయ్......అతనెవరన్నా చూచారా సీతా,

సీత - అబ్బే. ఎవరూ లేందే అక్కడ

చిట్టి - ఏంటి, ఎవరూ లేరు. అమ్మో అమ్మో ఆ పొట్టోడు ఎంతమూసాడు సిన్న ముప్పానలా కళ్ళజోడు పెట్టుకొని, ఎందుకూ అబద్ధమాడతావు అట్టా.

వేణు - (చిట్టివంక చూస్తూ...తరువాత సీతతో) ఆఁ, తరువాత ఏంజరిగింది సీతా,

సీత - లోపలకొచ్చింతరువాత చేయిపట్టుకొని ఏమిటో నిన్నే పెళ్ళి చేసుకుంటా; ఆకాశం సాక్షిగా, భూదేవి సాచ్చిగా అంటున్నాడు.

చిట్టి - (నాలుక కరచుకుంటాడు)

రంగన్న - (కోపంగా) పిలను యింట్లో పెట్టి వెళితే! యింతపని చేస్తావా! ఇన్నేళ్ళనుండి యీ యింట్లో పనిచేస్తున్నాంగాని యిట్టా ఎప్పుడూ జరగలా! అయినా బాబుసాలు ఎక్కడికిపోతది ఏళ్ళురాగానే సరా! కుక్కకూ వచ్చినై సికూ వచ్చినై.

చిట్టి - (తెల్లమొఖం వేస్తాడు)

వేణు - తొందరపడకు రంగా! నేను మందలిస్తాను. అమ్మాయిని తీసుకుని ఇంటికి వెళ్ళు యీ సంగతి ఎవ్వరితో చెప్పకు. ఆఖరకు రాజారాంగారితో కూడా అనొద్దు!

రంగన్న - అట్టాగే బాబూ! రా! అమ్మాఁ (వెళ్ళిపోతారు.)

వేణు - ఎందుకురా! నీ బ్రతుకు మండా! నిష్కలంకమైన వంశములో, శనిపక్షిలాగా చేరావు.

చిట్టి - (కోరచూపు చూస్తాడు)

వేణు - అలా చూస్తావేరా! రాస్కెల్, చావరాదూ ఏ గోతులోనైనా పడి. (వెళ్ళిపోతూ తిరిగి చూస్తగా చిట్టి తీవ్రంగా చూస్తూవుంటాడు.) ఏం అట్లా చూస్తావు

చిట్టి - ఇసారపడతన్నా లే! (తల చేతితో పట్టుకుంటాడు)

వేణు - ఏడువుకూర్చుని. (వెళ్ళిపోతాడు.)

చిట్టి - (తలఎత్తి రెండడుగులువేసి) ఒరేయ్! వేణుగా! యిన్ని తిట్టావురా సరే కాచుకో ఏంతిట్టావురా! ఏంతిట్టావురా! ఆడదానిమాటలు నమ్మి నువ్వుండికూడా, ఆ రంగడిగాడితో నామీద వ్రాయిస్తావా, నన్ను తిట్టిస్తావా, ఒరేయ్! నాకు తెలుసురా! నీకడుపుమంట మాట మాటకే మాయింటికిరావటం మంచిదికాదురా అన్నాయన్నాననేగా అసలు నువ్వెవడవెహె మాయింటికిరావటానికి కులపోడువా గోత్రపోడువా!...ఒరేయ్ నీవాలకమంతా నేనోకంట కనిపెడతున్నా లేరా!...నువ్వు మాట్లాడితే మాయింటికి రావటమేమిటో! మాఅమ్మాయి సంగతి అడగటందేనికో నీ యవ్వారమంతా, రేపు మాబావయ్య దగ్గరకెళ్ళి తేలుస్తా అసలు రేపీపాటికి నువ్వు గయామారేరో (చేతులు పైకెగతీసి) ఒరేయ్ అసలుమీరిప్పుడు రండిరా! యిప్పుడే తేల్చేస్తా (చేతులు క్రిందకులాగి) అయినా నేతొందరపడటమెందుకులే మాబావయ్య దగ్గరకెళ్ళి...ఆయనతో... ఊఁ! ... అనిపించుకొని, వచ్చి మీసంగతి కనుక్కుంటా (విసుగుగా వెళ్ళిపోవును)

( తెర జారును )

# చతుర్థరంగం

4 వ దృశ్యం. స్థలం : మద్రాస్‌లో కమల్ రూమ్.

(2 కుర్చీలు. 1 పడక కుర్చీ. 1 డ్రాయరు. గోడలకు అద్దమైన పటములు చేతితో వ్రాసినవి)

కమల్ - (కూర్చొని లెటర్సు వ్రాసుకుంటూ వుంటాడు)

(చిట్టి ప్రవేసించును)

చిట్టి - (ప్రవేసించి కమల్ కుమారుపు చూచి తిరిగి తెరలోకి చూచి) యిక నువెళ్ళయ్యా! వున్నాడులే... యిప్పటికి దొరికావు బాబూ!

కమల్ - (తలెత్తి చిట్టిని చూచి) అరి పిడుగా!

చిట్టి - పిడుగో, పాడుగో తిరిగి తిరిగి కాళ్ళుకుంటుములై పోయినై ఎంతమంది నడిగినా, నీ జాడతూ పొంతూ చెప్పరయ్యే! ఏదిరా, గతీ, అంటూ యీధీధితిరుగుతూంటే, ఆయనెవరో కనపడి పుణ్యాం కట్టుకున్నాడిప్పటికి.

కమల్ - అసలేంపనిమీాద వచ్చావు, ఏమిటి కథ.

చిట్టి - పనిమీాదే వచ్చా (తలవ్రావుచు) తొందరపడ్తావే! చెప్తాగా వుండు.

కమల్ - సర్లే! మా అమ్మగారి సంగతెలావుందో, మీాకేమన్నా తెలిసిందా!

చిట్టి - ఏమో! నాకేం తెలుస్తుందాగొడవ! ఏమిటసలావిడ గారికి.

కమల్ - నీమొఖంలే! జ్వరం వస్తోందని లెటరు వ్రాసాను. మా మోహన్.

చిట్టి - అరి దేవుడా! లెటరంటే గుర్తొచ్చింది. యిదిగో నీ లెటరు. మాబుల్లి నీకు రాసి పోస్టులో వేసుమంది (చేతి కిచ్చును)

కమల్ - యింకేం, అది చేత్తో పట్టుకొని యిక్కడ వాలావన్న మాట.

చిట్టి - లేకపోతే ఎప్పుడొచ్చి నీదగ్గర పడ్డావమా అని, కొట్టుకుంటూ యడ్రస్ చెప్పమంటే సెప్పిందనుకున్నా!

కమల్ - (లెటర్ చదువుతూ వుంటాడు)

చిట్టి - ఏం రాసిందేమిటీ

కమల్ - వెళ్లిన పనిలో విజయం పొందేవరకు తిరిగి రావద్దని

చిట్టి - (తలవూపుతూ) రావద్దనే, రాయించాడూ!

కమల్ - (ఆలోచనగా) అమ్మ విషయం వ్రాయలేదే!

చిట్టి - ఏంటాలోచిస్తన్నావు బావయ్యా!

కమల్ - అబ్బే ఏం లేదోయ్! మా అమ్మగారికి ఉపచారం చేయడానికి, మీ అమ్మాయిని వెళ్ళమని జాబురాద్దామా అనీ.

చిట్టి - నువ్వు రాస్తే మాత్రం, ఎల్లనీయొద్దూ!

కమల్ - అదీ నిజమే! ముసలాయన్ను దాన్ని వదలి వుండలేరు పాపం.

చిట్టి - ఆఁ! ముసలాయనో. ముసలాయనో అంటావు నువ్వు. ముసలాయన నొదిలినా, పడుసాయన నొదలొద్దు...

కమల్ - (ఆశ్చర్యపడి) పడుచాయ నెవరోయ్'...

చిట్టి - ఎవరా! ఎంగవేటీ! తానూ బొంగరం లేసి వెధవొక డున్నాడులే. పొద్దత్తమానం ఆడింటోనో మా ఇంటోనో దద్దరిల్లి పోవాల్సిందనుకో.

కమల్ - (తీవ్రంగా) ఎవరోయ్!

చిట్టి - యింకెవరూ! ఆడే! ఏణుగోపాళంగాడు!

కమల్ - ఓహో! అతనా, వేణు! బాల్యమిత్రుడు కాదటోయ్ అందుకని

చిట్టి - అదిగో అనే తెచ్చింది కతక్కాళ్ళు ముంతకు చెవులూనూ...శీటికి మాటికి కింటికొచ్చి శిందులెత్తి యిందులు మెక్కడానికీ దేవడంట. కులపోడా గోత్రపోడా! ఆవని తగదిబ్బాయన్నానః నానాకూతలుకూసి యీంపు చిట్లకొట్టి రంగడి సీతమొఖాన్న వుమ్మేయిస్తాడూ! నన్నే యింత చేసినాడు నిన్నెంత చేస్తాడో. నీవే తెల్సుకోవాలిక. అసలు మాబుల్లికి ముద్దుంటే యీగాడ వెందుకొస్తుందట యిదిగో బావయ్యా! చూస్తూఫూరుకుంటే మేస్తాపోతుందిక, ఆయన్ని నీకెందుకూ. నువ్వు ఊఁ! అను ఆడంతు నే తేలుస్తా.. ఆడితస్సాదియ్యా ఏంగుసగుసా! ఏంకిసకిసా! నూరిపోత్తున్నాడు...అసలీ దేవడంట మనింటికి రావటాన్కి—

కమల్ - (చిట్టిని చూసి నవ్వుతూ) ఖచ్చితమైన పిచ్చివాడ వోయి చిట్టి!

చిట్టి - నేనా ! నువ్వా ! ఆ గ్రుడ్డినమ్మకంలో వుండబట్టే బొమ్మలాడిత్తున్నాడందర్ని, పాడుమాటలు సెప్పగూడదు గాని. ఎదురొచ్చినోడల్లా నన్ను ఆపటం, ఏరా! చిట్టి మీ బావయ్య యీడా, ఆడా. అని అడగటం తలకొట్టేసినట్లుంటోందనుకో, యిన్నెందుకూ. యీనమ్మకంతో ఇంకా నాలుగురోజు లిట్టాగే సాగితే పూరా పుడకతో పిట్టలు రెండూ బుర్ర నెగిరి చక్కాపోతై—

కమల్ - (బిగ్గరగా వెర్రికేకలా) చిట్టీ! (చేతిలోవున్న పుస్తకముతో చిట్టిని కొడ్తాడు) . . . బైటచూడు సుడిగాలి పిడుగుల్తో జడివాన సాగినట్లుందీ ?

చిట్టి - (తెరలోకి చూచి) గాలీ లేదూ వానా లేదు.

(టెలిగ్రాం బోయ్ ప్రవేశం)

టె. బో - టెలిగ్రాం సార్,

కమల్ - (సంతక చేసి టెలిగ్రాం తీసుకొని చదివి విచారంతో తలవంచును)

టె. బో - (వెళ్ళిపోవును)

చిట్టి - (మెల్లన ప్రక్కకువచ్చి) ఏంటది బావయ్యా,

కమల్ - (కెర్రిమూపులతో చిట్టివైపుచూచి తలవాల్చి) చీకటి.

చిట్టి - కంగారుపడక! అసలేంటదీ, సెప్పు.

కమల్ - పద వెళ్ళిపోదాం. మా అమ్మకు చాలా ప్రమాదంగా వుందనీ మోహన్ టెలిగ్రాంయిచ్చాను.

చిట్టి - మరి మావూళ్ళో దిగవేంటీ,

కమల్ - (చిట్టివాక నిలువు చూపులతో) అవును అల్లానే చేద్దాం, మోహన్‌కు లెటర్ కూడా వ్రాస్తాను.

(తెర జారును)

## పంచమరంగం

5 వ దృశ్యము. స్థలం రాజవీధి

(ఒకవైపునుంచి పెట్టె బెడ్డింగు ఎత్తుకొని చిట్టి వెనక కమల్, మరొకవైపునుండి రాజారాం ప్రవేశింతురు)

చిట్టి - (దానికి చూస్తూ) బావయ్యోయ్ అదుగో తాతయ్యొస్తున్నాడు (కమల్ వెనుకకు పోతాడు)

కమల్ - నమస్కారం తాతయ్యా,

రాజా - పట్నంనుంచేనా బాబూ, ఉత్తరం వ్రాస్తే స్టేషనుకు బండీ పంపేవాడినే, (చిట్టిని చూచి) నువ్వెక్కడకు పోయావురా. చిట్టి, చెప్పకుండా.

కమల్ - పట్నం వచ్చాడు లెండి,

రాజా - ఊఁ, సరే, యింటికి పదండి నాయనా, నేవెళ్ళి అమ్మాయిని తీసుకువస్తాను వేణుకు జ్వరం వస్తోంది పాపం.

కమల్ - ఉఁహూఁ అల్లాగా, ఎన్నిరోజుల్నుండీ.

రాజా - ఓ వారం రోజుల్నుంచీ

చిట్టి - అందుకని బుల్లి చూట్టానికెళ్లిందా, తాతయ్యా.

రాజా - ఊఁ యింటికి పదండి బాబూ, నేపోయొస్తా.

చిట్టి - (కమల్‌తో నెమ్మదిగా) నేచెప్పలా.

కమల్ - (ఆలోచనగా) నేనెళ్ళి వస్తాలెండి అతన్ని చూచి నట్లుకూడా వుంటుంది.

రాజా - నిజమే, వెళ్ళిరా నాయనా, నువ్వింటికి పదరా చిట్టి.

(నిష్క్రమిస్తారు)

6 వ. దృశ్యం. తెర ఎత్తగా స్థలం : వేణు యిల్లు.

వేణు పుస్తకంచదువుచుండగా సరళ విచారంగా ప్రక్కన కూర్చొని యుండును. బల్లపై బత్తాయిలు చాకు మందుసీసా. గ్లాసులు వుండును.

సరళ : అదుగో వద్దన్నపని చేస్తుంటావ్.

వేణు - ఏమిటి సరళా . .

సరళ - చదవొద్దు బాబూ అంటే మానవేం ?

వేణు - పరవాలేదులే సరళా ! కొంచంతగ్గిందివాళ జ్వరం, చూడూ ఆ ముసలితండ్రికి ఎంతప్రీతో డాక్టర్ని చేసుకో బిడ్డా. నాజీవితం చరమసంధ్యలలో మసకుపడకముందే మీ దాంపత్యానురాగఫలాన్ని, మనుమణ్ణెత్తుకుముద్దాడి ఆనందిస్తా ఆ తర్వాతనే, గుండెలపై చెయ్యివేసుకొని శాశ్వత విశ్రాంతిని తీసుకుంటా అని ఎంత బ్రతిమాలుకున్నా విలియం వింటున్నాడేమో చూచావా, కాని, నిజంగా టెన్నిసన్,

సరళ — ఏమిటా పురాణం వేణూ, యీ జ్వరమేమిటీ యీ వెర్రిదోరణేమిటి! యిలాగైతే నే వెళ్ళిపోతానబ్బాయ్! చెపుతున్నాను —

వేణు — (చిరునవ్వుతో) కాదు సరళా! కూర్చో చెబుతా! ముడతలుపడిన ముసలివాళ్ళ హృదయములో మృదుమధుర ప్రేమ. మూలుగుతూంటుంది కాబోలు.

సరళ — ఆ పుస్తకములా పారవేసి, యీమందు త్రాగుబాబూ! లేకపోతే వెళ్ళిపోతాను. (లేచును)

వేణు — వెళ్ళిపోతావా! సరళా! అప్పుడే వెళ్ళకేం చేస్తావ్. అడుగు నడవనీక అల్లారుముద్దుగా అమ్మా. సరళా! అంటూ ప్రేమించి పెంచుకుని, అరనిమిషముకూడా నిన్నువిడిచి వుండలేని, నిష్కల్మష, నిరాడంబర హృదయమూర్తి నీ తాతగారికంటె నే నధికుడనని అంటావా నాదగ్గర.

సరళ — (బుజ్జగింపుగ) ఊర్కో—వేణూ, ఉపన్యాసాలికి దేనా సమయం. జ్వరం తగ్గిన తర్వాత మాట్లాడుకోకూడదు. పిచ్చివాడవుగాని, నీకుమాత్రం ప్రేమించే వాళ్ళు లేక పోవడమే

వేణు — ఎవరున్నారు సరళా యీవిధంగా పళ్ళంతా కళ్ళుచేసుకుని కంటికి రెప్పలా, కాపాడుతున్న తల్లితప్ప... పసితనంలోనే తండ్రి పరలోకంచేరాడుకదా! కష్టబాధల కడగండ్లెవరు భరిస్తారు సరళా!

సరళ — ఎవ్వరూ భరించనక్కర్లేదు. దైవమే భరిస్తాడు.

వేణు – అదృష్ట దైవమెలా భరిస్తాడు. సరళా! కష్టసుఖాలు, దుఃఖోపశమనాలు పంచుకోవటానికి ఒక జీవితనౌకా. గుండెను చీల్చివేసే ఒక సుస్నేహ అవసరం లేదా! సర్వం ప్రేమమయమై వుండు. ప్రేమచేతనే ప్రపంచం సృష్టింపబడినప్పుడు మానవ హృదయాలు మాత్రం ప్రేమను పంచుకోవటానికి కాదా, తేనె పుష్పాలనుండి మధువు స్రవిస్తుంటేనే తేనెటీగలా బాధను సహిస్తుంది. అల్లాగే ఒక ఆశ ప్రేమిచే ఒకవ్యక్తి ప్రతిమానవునిలో వుంటేనే కాని జీవితాశ, జీవితమాధుర్యమూ, జీవితజ్యోతి హృదయంలో అంకితం కావు. అలాంటి ఆశ నాకేమైనా వుందా సరళా!

సరళ – అబ్బ! వేణూ నీ హృదయమెంత అగాధం.

కమల్ – (ప్రవేశించి చూచి ఆగుతాడు)

సరళ – ప్రేమమయమైన నీహృదయాన్ని నేను ప్రేమిస్తున్నాను. నిన్ను నా హృదయసామ్రాజ్యంలో ఒక పవిత్రప్రేమజ్యోతిగా భావించుకొంటున్నాను. నీవు నాకాత్మీయుడవు. నిన్ను నేను ప్రేమిస్తున్నాను వేణూ!

వేణు – నిజం!.. నిజంగానే నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా సరళా!

సరళ – అది నాకర్తవ్యం! ముమ్మాటికి ప్రేమిస్తాను యింకనైనా నమ్ముతావా! దైవస్వరూపమైన, ప్రేమతత్వాన్ని తమ తమ హృదయానుకూలంగా తుచ్ఛమైన కామన్నే ప్రేమంటూ మోసగించే కుచ్చితులను ప్రేమించ

టంకంలా నీలాంటి పవిత్ర హృదయులను ప్రేమించటమే భావి భాగ్యోదయానికి పండువెన్నెల వేణూ! ... మందు తాగవా!

వేణు - తప్పకుండా, సరళా! (తాగుతానేదీ (పుస్తకం అలా పారవేసి చేయిచాస్తాడు)

సరళ - యిదుగో వేణూ! యిదే నీ స్వస్థౌషధి. ఈ దోసుతో నీకు పూర్తిగా తగ్గిపోతుంది (తన చేతితోనే మందు త్రాగించును.)

కమల్ - (చూచి గుర్రుగా చేసి ముఖం చిట్లింపున వెనక్కు తిరిగి) ఆహది (పోవును)

సరళ - బాగా కులాసా చిక్కేటంతవరకూ ఏం చదవకూడదు. ఎక్కువగా మాట్లాడకూడదు. యిది ప్రేమశాసనం వేణూ! వెళ్ళివస్తాను ఏం.

వేణు - మళ్ళీ యెప్పుడు రావటం సరళా!

సరళ - నువ్వే రావాలి మాయింటికి పూర్తి విశ్రాంతి తీసుకుంటే రాగలుగుతావు. వెళ్తాను వేణూ! (తిరిగి చూస్తూ నిష్క్రమించును.)

( తెర జారును )

7 వ దృశ్యం స్థలం రాజవీధి

(ఒక వైపునుండి మతివిభ్రమణంతో చీకటి గోడప్రాంతగా కమల్. మరొక వైపునుండి పిచ్చివాడు పాటతో ప్రవేశం.)

పిచ్చివాడు - పాట:- నమ్మకురా - నమ్మకురా
వనితాజనమును - నమ్మకురా! ॥నమ్మ॥

మాయమాటలను - మమతను గొలిపి
మరుగు చేష్టలను - సాగించెదరూ ॥నమ్మ॥
కామినిలో - సంసారసాగరమూ
గడుపగలేవూ - మునిగిపోయెదవు
నావికుడే నిను - మోసగించురా ॥నమ్మ॥

(కమల్‌కుమార్ దగ్గరకు వచ్చి చూచి వెకిలినవ్వు నవ్వును)

కమల్ - (వెర్రిగా చూస్తూ నిస్పృహగా నిల్చుండును)

పిచ్చివాడు - (కమల్ ముఖములో ముఖంపెట్టి వెకిలినవ్వుతో) యితడొక వెర్రివాడు! (తిరిగిచూచి) యితడూ నామాదిరిగానే ఆడదాని గారడీలో, మోజుదాని మోసంలో, తిక్కెక్కిన పిచ్చోడు (చూచి) అవును అంతే...

కమల్ - (వెర్రిచూపుల దిగాల్పడి చూచుచుండును.)

పిచ్చివాడు - ఇకముందు మాత్రం ఎప్పుడూ నమ్మకాడదాన్ని నవయుగనారీ పిశాచాలు, యిలాగే శవాన్ని చేసి సవాలు కొడతాయ్! తెల్సుకున్నావా! నమ్మక. ఆడదాన్ని మాత్రం నమ్మక, నాగతిచూడు (ఏడ్చును) ఎంతో ప్రేమించాను. ఏడు సంవత్సరాలీడూజోడుగా, సంసారం గడిపాను. చేసుకున్న భార్యే ముత్యాలవంటి మూగ్గురు పిల్లలు ముక్కుపచ్చలారని పసిపాపలు. పండంటి కాపురం! ఏదైతేదానికేం! కామోద్రేకంలో కళ్ళుపొరలేసి పోయినై అప్పుడప్పుడూ బస్తీలకెక్కి గస్తీలు తిరుగొచ్చేది. స్వాతంత్రమంటూ, పాపిష్టిది, చివరికి కన్నబిడ్డల్ని కూడా వదిలివేసి, పరాయి

మగాడితో పరాన్నైపోయింది నీచురాలు... ఆపిల్లలు...
అమ్మా.. అమ్మా అంటూ (ఏడ్చును)

కమల్ - (నేత్రమగాపుల కండ్లనీరు కార్చును)

పిచ్చివాడు - (స్పృహలోనికి వచ్చి) ఓ అమాయక పురుషు లారా! ఆడదాన్ని నమ్మకండి! నమ్మకండి బాబూ! అది చీడపురుగు మగవాడిజీవితాన్ని నాకేస్తుంది. అది మహా మాంత్రి మగవాడివంటి రక్తాన్ని పీల్చిపిప్పిని చేసేస్తుంది. అది సహాశక్తి అది ఎప్పటికైనా! మగవాడిని సమాంతంగా మింగేస్తుంది...అది పక్కలో బల్లెం, కిక్కురుమనకుండా డొక్కలో పొటేస్తుంది. నమ్మకండి బాబూ నమ్మకండి.

పాట:— నమ్మకురా - నమ్మకురా, వనితాజనమును
నమ్మకురా "నమ్మ" (పాడుతూ వెళ్ళిపోవును)

కమల్ - (పిచ్చివాడు పోయినవైపే చూస్తూ మతిభ్రాంతిమున) హృదయసామ్రాజ్యం, ప్రేమసీమ. ప్రణయరాణి ప్రతి ధ్వనిస్తోంది, ప్రణయబిక్ష చిచ్చురగిల్చింది. అనురాగ మృతాస్వాదనకుమారు హాలాహలాస్వాదన, మంత్రపియ మునకుమారు, మారణమంత్రం ప్రేమమూర్తికిమారు భీకరమూర్తి సందర్శనం. అగాధం, అజ్ఞాతం, అయోమ యాంధకారా బంధురం. భయంకరం స్త్రీహృదయం, కాల నీలిమబ్బులో విలయాకాశము, భీగోల్కాపాతముకూడ విజృంభించుచు కాబోలు. యిదికాళరాత్రి కాదు. భయద గాత్రి మాతృసందర్శనమునకు మారు. మహాంకాళి మాతృ సందర్శనము తల్లియడల అపచారము. మృత్యుశయ్యపై

తల్లి మూల్గుతుంది బిడ్డా, బిడ్డా అని అలమటించిపోతోంది. అబ్బా భయోద్రేకం! వజ్రఘాతం. మాతాజ్ఞాతిరస్కృతాపచార వహ్నిజ్వాలల, ఘోర ద్రోహం... మహా పాపం! అమ్మా! అమ్మా! (నిష్క్రమించును)

## షష్ఠము రంగము

8 వ దృశ్యము. స్థలం : రాజారాం ఇల్లు.

(డ్రాయరుపై కపిల్ కుమార్ ఫోటో దాని ఎదురుగా కుర్చీలో కూర్చొని సరళ విచారంతో)

(ఒక వైపు నుండి చిట్టెమ్మ, మరో వైపునుండి రాజారాం విచారంతో ప్రవేశించి సరళకిరుప్రక్కల కూర్చొంటారు)

రాజారాం - సరిగ్గా ఇవ్వాళ్టికి మూడునెలలు. ఎక్కడికి వెళ్లాడో ఏంచేస్తున్నాడో, అసలెందుకు వెళ్ళాడో కూడా తెలియకుండా వుంది...

చిట్టి - వాళ్ళమ్మ చచ్చిపోయిందని మతిచెడిపోయిందేమో,

రాజా - (ఆలోచనగా) అయితే అదీ నిజమే కావచ్చు. అయినా పట్నంనుంచి, ఎకాఎకిని మనవూరికే వచ్చినవాడు, మనకు తెలియకుండానే వెళ్ళిపోవటమేమిటంట.

చిట్టి - తల్లిప్రేమ నీకు తెలీమలే తాతయ్యా,

సరళ - వేణు ఇంటికివస్తే నాకు కనపడకుండా ఎందుకు వెళ్ళారు తాతయ్యా,...

చిట్టి - అసలూళ్ళోకొచ్చింతర్వాత నీకు కనుపడకుండా, ఎందుకెళ్ళాడు.

మోహన్ - (ప్రవేశించి)

సరళ - (చివాట్లు తేచిగ్గుగా వెళ్ళి) ఏం అన్నయ్యా, అంతే మైనా తెల్సిందా.

మోహన్ - లేదమ్మా. చిన్నకేబాధువుంది కాని స్నేహితులు కాని వాడిని చూచినట్లు కనుపించదు.

సరళ - (కంటనీరు కార్చుచు తాతగారి దగ్గరకి వెళ్ళుచు) అసలు...

రాజా - కనుక్కోగలిగావా, మోహన్, ఏ కారణం చేత వెళ్ళాడో.

మోహన్ - నాకూ అదే అయోమయంగా వుంది తాతయ్యా, వాడు ఇంటికి వచ్చేటప్పటికే, అమ్మ చచ్చిపోయింది. ఆలస్యంగా వచ్చాడన్న విచారంలో (దేశంలో కొంచెం చింతిపడ్డాను దాని మీద ఏమిటో అర్థంగాని ఆవేశంలో (విచారంగా తల్లి శవాన్ని కూడా వదిలి వెళ్ళిపోయాడు. ఆ తరువాత మీరు వచ్చారు ఏదైనా వెర్రి అనుమానంతో వెళ్ళిపోయాడేమోనని నా అభిప్రాయం.

(రంగన్న ప్రవేశించి ఒక ప్రక్కగా నిలవబడతాడు)

సరళ - (ఆప్యాయ విచారాలతో) అనుమానమా, దేనికను మానం ఎవరిమీదన్నయ్యా,

చిట్టి - అనుమానం కలిగితే కలగొచ్చులే. ఎవరిమీదైనా అనుమానపడే వుండొచ్చు. అంతేలే (సరళతో) ఏమో, నీమీదేనేమో,

రాజారాం - నోర్ముయ్యరా, ఎధవ, పిచ్చిపిచ్చిగా వాక్కు. ఫో అవతలికి

మోహన్ - అప్పుడప్పుడు యింతర గొడవలేనైనా, యీవిధంగా జరిగే అవసరం కలుగదు అందుకే ఏమైవుంటుందా అని)

సరళ - (ఏడ్చుచు) అయితే నామీదనే, అనుమానం... ఎందుకూ. నేనేం చేశానని

మోహన్ - వెర్రితల్లి, విచారపడక, నే చెప్తున్నానుగా, ఆలోచన లేని అనుమానంతో వెళ్ళివుంటాడు, దానికోసం నువ్విలా గుండె పగులగొట్టుకుంటే ఎలాగమ్మా నీబుద్ధి మాకు తెలియందా, ..

సరళ - అయినా అంత తేలిగ్గా అనుమానపడే మనిషిగారు... ఏదో, పెద్ద కారణమేవుండాలి. అంత పెద్ద కారణం నాలో ఏముందో నా బ్రతుకే అందుకు ఆధారమేమో,

చిట్టి - ఏమో ఎవరన్నా, ఏమన్నా, చెప్పారేమో, ఏ పుట్టలో ఏ పాముందో ఎలా తెలుస్తుంది.

రాజా - ఎవరేం చెప్తార్రా, అయినా, మనలో మనకీ పొరపులు పెట్టాలన్న అగత్యం ఎవరికీ... మనమెవరికేం కీడు చేశామనీ

చిట్టి - నీకు తెలవదు తాతయ్యా, ఇంటి దొంగనీశ్వరుడైనా పట్టలేడు (రంగడివంక చూచి పళ్ళు కొర్కును)

రాజారాం - వాడికేసి చూస్తావేమిట్రా! వాడేమన్నా చెప్పాడేమోననా ఓరివాజమ్మా, మిన్ను విరిగి మీదపడినా ఒకరి విషయం ఒకరికి చెప్పడు. వాళ్ళ తాతలనాటి నుంచీ, మనింట నౌకరీ చేస్తున్నాడు. అసలు నువ్వేమన్నా వాగేద్దానివేమో చెప్పు.

చిట్టి — అప్పుడ్లే ఎర్రోడి పెళ్ళాం వాడకల్లా వదినంట అట్టాగుంది. యింతకూ, మీరాయింట్లో వుండననేగా నౌకరోడి దగ్గర్నుంచి సులాకనయ్యాను. పోతానంటే పోనీరు. పోతేనే నాంచిది ఎందుకొచ్చింది రభసాతా (లేచి) పోతాగానీ అసలు గుట్టాయన్నలోనే వుంటే, ఆడు శెప్పాడీడు చెప్పాడ గాడిపోసుకోటం కూడా తప్పే!

మోహన్ - (ఆప్యాయంగా) ఏమిటా అసలుగుట్టు చిట్టీ

చిట్టి — నాకెందుకొచ్చిన గొడవలే బాబూ. మీరాతిప్పలు మీరు పడండి. నేనేదన్నా! కుతికట్టుకుంటారు.

రాజా - తెల్సిందేదో చెప్పేస్తే నాకెందుకంటె ఎట్లా ప్రాణాలుపోతుంటే.

చిట్టి - నువ్వడగావుగాబట్టి సెప్తున్నా, బావయ్య బలే పెద్ద మడిసనుకున్నా, కొత్తలో... పట్టంఎల్తె బట్టబయలైందా గుట్టునాస్తా.

రాజా - త్వరగా చెప్పిచావరా! అదేమిటో...

చిట్టి - శెప్పుట లేదేంటి. మొన్న నేను పట్టంఎల్లలే అప్పుడే కాఫీ కోసం బజారు వంపాడనన్ను... దారిలో పోలీసోళ్ళకు మనకీ చాలాడరిగింది అదికూడా శెప్పమన్నారా!

మోహన్ - అదంతా దేనికిలే, అసలుసంగతేమిటో చెప్పు.

చిట్టి - పోనీ, అక్కడకక్కడా శెప్తా!

రాజా - పళ్ళూడగొట్టు ముందు గాడ్దెను.

చిట్టి - సరేలే ఎల్లి తిరిగొచ్చేసరికి, కళ్ళు జిగేల్‌మన్నై వొళ్ళు జల్లుమంది. బుర్ర తిరిగిపోయింది. మోహన్ తీరా మొద్దు నగందా పకపకలాడ్తూ బావయ్యముఖం మీదికి బాణం లాగా వంగి బాసాడ్తోంది. బంగారు బొమ్మనుకో

సరళ - (కన్నీటి ఏడ్చుచు) నిజంగా నా చిట్టి మీ బావయ్యేనా!

చిట్టి - యింకా సెప్తా విను.

రాజా - చెప్పక్కర్లేదులే యిక. నోర్ముయ్, (మోహన్‌తో) అర్థమైందా మోహన్. అంతు తేలినట్టేనా! యిల్లా తయారయ్యాడన్నమాట కమల్‌కుమార్! రైలు దిగొచ్చానాడేను రైనప్పుడే వాలకాన్నిబట్టి ఏదో అనుమానించాను. కాని యిల్లాంటిదనుకోలేదు. వెంటున్న యీ వెధవ చెప్పలేదప్పుడు.

చిట్టి - నిక్కచ్చియవ్వారమనుకున్నానేటి, ఆకూసేపేకా మోసమనుకున్నా నాకేం తెల్సు...

మోహన్ - యిదిమాత్రం నేను నమ్మలేను తాతయ్యా! ఒకవేళ ఇల్లాంటి అభిప్రాయముంటే యిక్కడకువచ్చి వెళ్ళిపోవటం దేనికి.

రాజా - యింత అమాయకంగా మాట్లాడతావే మోహన్. యీ వెధవ లేడయ్యా తైనా వెళ్ళే వెనక, పీడిప వదిలించుకోవడానికి ఇక్కడకొచ్చుంటాడు.

చిట్టి - ఆఁ! అంతే, మీరు నమ్మండి, నమ్మకపోండి. ఏమన్నా అనుకోండి, ధగధగా మెరిసిపోయిందానికోసమే దాడేసి

కెళ్లాడు, బావయ్యా యిందులో ఏం ఢోకా లేదు. దానెంట పడేవాటి కేమీదో జండా పీకేసుంటాడు

సరళ – తెలిసి నేనే పాపం చేయలేదు. మరి యిది ఏ పాపం యొక్క ఫలితమో తెలియదు. (ఫోటోతో) నాలో ఏం లోటును గురించి నన్నిలా ఏడ్పించటం కమల్...

రాజా – ఏది, ఎల్లాగైనా ముందు తను ఎక్కడున్నాడో తెలుసుకోవటమే మన కర్తవ్యం. కమల్ ఇంత ద్రోహిగా సంచరిస్తాడని కలలో కూడా అనుకోలేదు నేను...

సరళ – పోన్లెండి తాతయ్యా నా కమల్‌ని దూషించకండి.

రాజా – అవున్లే అమ్మా ఎదుట లేని వ్యక్తిని, ఏమీ అనకూడదు నాకు తెలుసు కానీ ఏం చెయ్యను. నీకన్నీటి పొంగుకు నా కడుపు తరుక్కుపోతుంటే నాయనా! మోహన్ ఏం చేద్దామంటావు

మోహన్ – ఎట్లాగైనా కానీండి కమల్ యీ ప్రాంతాలలో లేనట్టే అందుచేత మనం దూరప్రాంతాలలో విచారించడం మంచిదేమోనని.

రాజా – వేణు మద్రాస్‌నుంచి యీ బండికి వస్తానని జాబు వ్రాశాడు. రావచ్చు బహుశా

చిట్టి – రానచ్చేంటికీ. రానేవత్తే (కోపంతో వెనుదిరుగుతాడు)

సరళ – (లేచి) ఏం వేణూ కనుపించారా.

వేణు – లేదు సరళా, పట్నం యావత్తు గాలించాను కమల్ నెరుగున్న ప్రతివ్యక్తికి ఆశ్చర్యపడి కన్నీరు కార్చనివారు లేరు వాళ్ళందరూ ఎంతో ఆప్యాయంగా కమల్ జాడతీయడానికి

పట్నంలోనే గాకుండా, చుట్టుప్రక్కలకూడా, స్వయంగా పోయి తెలుసుకువచ్చి, చాలా చింతించారు కమల్ అంటే వాళ్ళందరికీ, ఎంతగౌరవం, ఎంతప్రేమ, నాకెంతో ఆశ్చర్యం కలిగింది...

రాజా - అయితే కానివ్వు కానీ, కమల్‌మాత్రం మనవంశానికి తీరనికళంకాన్ని తీర్చిదిద్దిన, తేజఃపుంజం కత్తని తేల పోయింది దేంతోనో కలిసి లేచిపోయాట్ట

వేణు - ఎవరా అన్నది మనిషా, పశువా

మోహన్ - మనచిట్టి చెప్పాడు. ఎవరా ఒకస్త్రీతో సరసాలాడుతుంగా. మొన్న ఇతను వెళ్ళినప్పుడు చూచాడట. దానికోసమే తిరిగి వెళ్ళాడని తాతగారి అభిప్రాయం. నాకా విషయంలో ఎంతమాత్రం నమ్మకం కలుగటంలేదు.

వేణు - నాన్సెన్స్. వీడేదో పొరపాటు పడివుంటాడు. కాకపోయినా కమల్‌కు అక్కడున్న గౌరవప్రేమలను బట్టి ఒకవేళ ఎవరైనా ఫ్రండ్స్, రాకూడదా. అంతమాత్రంతో, అజ్ఞానుడెవడో అన్న మాటలనునమ్మి చెడుగా వూహించడం వెర్రితనమంటాను. కమల్ నడతను శంకించటం గ్రుడ్డితనమంటాను. విద్యావిజ్ఞాన సంపన్నుడైన, కమల్‌ను, విలాసభోగిగా వూహించటం హృదయశూన్యతంటాను. ఎదుటవాని వ్యక్తిత్వాన్ని గుర్తించలేని వ్యక్తి, మానవత్వంలేని మహిషమంటాను. గౌరవకుటుంబీకుడైన, కమల్, కామోద్రేక పరివాహంలో కళ్ళుమూసుకుని, గంతులేసేంతటి అవివేకి కాదంటాను ఘట్టిగా. (...బదర్ మోహన్ లోకులు

కాకులన్న సామెతను, దృష్టిలో నుంచుకొని, కమల్ కుమార్ అన్వేషణ విషయంలో, మా అందరికంటే కూడా, యిప్పటికంటె వేయిరెట్లు బాధ్యత సహించాలనీ యీ సంఘటనలోని సత్యాన్ని సోదరులో కాని కాదగ్నసితిగా అందింపటాని కాత్మబలికైనా వెనుతీయక పాటుపడాలనీ మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. (ఆలోచనగా చిట్టివంక చూచి) అక్కడి విషయం ఒక్కరినోటకూడా వినలేదు నేను....

చిట్టి - ఊఁ! ఇక వేణుగోపాళంగారి తీర్పు అయిపో... ఇందండి.

మోహన్ - (వేణుతో) మీరింతగా చెప్పాలా నాకు. ఒక్కతల్లి కడుపున పుట్టకపోయినా, యిరుగు పొరుగుల బిడ్డలమైనా నిజానికిద్దరం మిత్రులమేయైనా బాల్యంనుంచీ యీనాటి వరకూ యికముందుకూడా ప్రకృతిదృష్టిలో మేముభయులం ఏకోదర సోదరులుగా హత్తుకుపోయాం. సన్మైత్రి లక్ష్యాన్ని చాటి, విశ్వసోదరప్రేమ బీజాలను వెదజల్లటమే, నా పరిశ్రమలక్ష్యం. ప్రధానాశయం. వాట్లసిద్ధికై నా జీవితాన్నంకితం చేస్తాను.

వేణు - (ధాంక్య్ వెరీమచ్) యికముందు మనం దూరప్రదేశాలకు వెళ్ళి విచారించడమవసరం మీరు బోంబేసైడు వెళ్ళండి, రేపు నేను కలకటా వెళ్తాను అక్కడ నాకు తెల్సిన వారుకూడా వున్నారు

చిట్టి - మోహానోయ్, నేనుకూడా ఎటన్నా ఎళ్లిరానా!

రాజా - వెళ్లు కాట్లోకి వెధవవాగుడూ నువ్వూనూ!

మోహన్ - బెంగుళూరు సైడ్ కూడా వెళ్ళటం మంచిదను
కుంటాను. వెళ్ళినవాడెక్కడోచోట వుంటాడు గదా! మనం తిర
గటంలో తారుమారు కావచ్చు. అందుచేత, సాధ్యమైనంత
వరకూ నాలుగువైపులా ఒకేసారి వెదకటం అవసరం.

సరళ - నేనూ బయల్దేరతా నన్నయ్యా! సుడిగాలి వడికారిన
నా ప్రేమజ్యోతిని స్వయంగా వెలిగించుకుంటాను. పిడు
గుల రాపిడికి నలుగుతున్న. కడుపుమంటల కార్చిచ్చును
నాకై నేనే చల్లార్చుకుంటాను. కాక, నాడీకాలసాగరంలోని
కాలకూట విషాగ్నిజ్వాలల కాహుతైపోతాను. (కన్నీరు)

మోహన్ - ఏడవకొదినా. నీ మానసికోత్సాహమే మా
కార్యసాధనకు ప్రోత్సాహం, నీవు బయల్దేరటం మంచిది
కాదమ్మా,...ఏం బ్రదర్ ఏమంటావు నీ అభిప్రాయం.

వేణు - నిజమే. నీవిప్పుడొద్దులే సరళా!.. యీ స్థితిలో తాత
గారూ శ్రమపడలేరు. అందుచేత, చిట్టిని బెంగుళూరు సైడు
పంపటం మంచిది. ఏరా చిట్టి వెళ్తావా రేపు బెంగుళూరు..

చిట్టి - బెంగుళూరు గంగులూరు నాకు తెలవదు. నేనెల్తే కం
కస్తే ఎల్తా!

వేణు - కంకటా, వెళతావా?

చిట్టి - యెల్తానంటే... మీ రెల్లగొట్టినోళ్ళు నేనెల్లలేనో
ణ్ణేనా! బుల్లి రాసిచ్చిన వుత్తరంలో, అమాంతంగా ఎల్లి
చెన్నపట్టంలో కూకున్నానే చెన్నపట్టంఎల్లినోణ్ణి కలకస్తా
ఎల్లలేను మీరుంటే ఆపైన నాలుగడుగు లుంటుంది...
అయినా నేనెల్లే దేంటంట బుల్లిచ్చిన వుత్తరం పుచ్చుకోని

రైల్లో కూర్చుంటే అమ్మాకల్లైతే అదే వసుకుపోయే. ఇంత పిన్న జనం ఏంటంట...

మోహన్ - సరే! వేణూ కలకత్తాలో నీ ఫ్రెండున్నాడు, అడ్రెస్ వ్రాసియివ్వు వాడికో లెటర్ కూడా వ్రాసియివ్వు వారి సహాయంతో మనవాడు ప్రయత్నిస్తాడు. ఆమాత్రం వెళ్ళ లేడూ! వెళ్తాం సరే ఏం' చిట్టి వెళ్ళలేవూ

చిట్టి - శకునాలు, పలకటమేగాని, తెలివిచ్చి పంపటం వుంటేగా మనసంగతెత్తేస్తోందుకూ...

వేణు - సరే అల్లాగే చేద్దాం...సరళా యికనీవువిచారం మాను యివ్వాలి లేకపోతే మాప్రయత్నం విజయానికి వెన్నెలుం లుండదు. కలకత్తావారి; అడ్రెస్ నీకూ యిస్తాను అవసర మైతే లెటరువ్రాసి విషయాలు తెల్సుకోవచ్చు.

రాజా - నాయనా! వేణూ! కలకత్తా నేను వెళ్తొస్తాను. చిట్టి గాడింటిదగ్గరే వుంటాడు. అమ్మాయికి తోడుగా వాడు అక్కుపక్షి వెధవ నేనే వెళ్ళాలిబాబూ!

మోహన్ - మీ రెందుకు తాతయ్యా! పెద్దవారు. దానికితోడీ మనోవ్యధవకటి. మీరు శ్రమపడలేరు యింటిదగ్గరుండి విశ్రాంతి తీసుకోండి

వేణు - నిజమే తాతయ్యా విచారోద్రేకంతో గుండెలు పగుల గొట్టుకుంటున్న సరళ. మీరు దగ్గరుంటె కొంతవరకైనా స్థిమితంలో వుంటుంది...

రాజా - కాదులేబాబూ నేనే వెళ్ళివస్తాను. కలకత్తాబాబు వారి అడ్రెస్ వ్రాసి యివ్వు యింకో మాటబాబూ పతనం

కానున్న నా వంశగౌరవోద్ధారకుడా కమల్ కుమార్ తల్లి లేని ఆ పసిపిల్లనీ అల్లారుముద్దుగా, కళ్ళల్లో పెట్టుకొని గంపెడాశతో ప్రేమించి పెంచి పెద్దచేసి కాపాడుకుంటూ, ఈ భర్త వియోగ విచారంలో, ప్రాణాంతకష్టాల పడిఉన్న నా చిట్టితల్లి ప్రాణదాత ఆ కమల్ కుమార్ ఆ కమల్ కుమార్ ను, తీసుకువచ్చి ఆ రెటిప ప్రతిష్ఠించాల్సిన బాధ్యత మా ప్రముఖులు మీరే గాబూ! ఎంతడబ్బైనాసరే వెనకాడొద్దు బాబూ కావల్సింది కమల్ కుమార్ మాత్రమే యిక లేవండి బాబూ భోజనాలు చేయండి.

వేణు - మేము కోరేదికూడా అదేగా తాతయ్యా

మోహన్ - కాని బాగు శ్రమపడటం, మాకెంతమాత్రం...

రాజా - ఫర్వాలేదులే నాయనా ఒకేయ్ చిట్టీ యింటిదగ్గరుండి అమ్మాయిని జాగ్రత్తగా చూస్తుండు సరేనా!

చిట్టి - ఊఁ! సరే ఎల్లండెల్లండి...

(తెరజారను)

సప్తమరంగము

9 వ దృశ్యం - స్థలం: కలకత్తాలో రేణుకాదేవి ఇల్లు

పెయింటింగ్ స్టాండ్ కెదురుగా నిలబడి కమల్ బొమ్మ వ్రాస్తూవుంటాడు. బొమ్మ (బ్రిడ్జిపై వెళుతున్న రైలు' బ్రిడ్జి ఇరిగి సగంబండి నదిలో పడుతుంది)

కమల్ పాట:- ఆశా...నిరాశ.

కలదా...చీకటిలో...ఆశాజ్యోతి ||ఆశా||

తారకమేదీ జీవితయాత్రలో

కనిపిస్తున్నది. (కొంచమాగి) ఆఁ అట్లనుకున్నాను. ఎంతసేపైందని వొచ్చి.

రేఖ- వచ్చినందుకు కాలం వృధా పోలేదు లే, అయితే మీరేదో పరధ్యానంతో వున్నట్లున్నారు,

కమల్ - అబ్బే! అదేమీ లేదు, కళాసేవకునితో పాటు కవిని కూడా కావాలని, ఈరోజే ప్రథమంగా ప్రయత్నం చేస్తున్నాను. ఎలా వుంది నా కవితా ప్రవాహం.

రేఖ - అది కవితా ప్రవాహం కాదు, హృదయాంతరాళాల్లోనుండి వుప్పొంగే ప్రళయానలజ్వాలలు, నిరాశాజీవి విషాద, దుర్భరావస్థ, ఎట్లానన్నను అది కవి కావాలని చేసే ప్రయత్నమనీ ఇది తప్పక ప్రణయజ్వాలే

కమల్ - ప్రణయజ్వాల .. ప్రణయజ్వాల (మనోప్రపంచకు పోవును)

రేఖ - (పరధ్యానంలో వున్న కమల్‌ను చూసి తిరిగి బొమ్మ వంక చూసి) అరే, మీ యాక్సిడెంటు జరిగినప్పటినుండి నాకిల్లాంటి దృశ్యాలు చూస్తేనే చాలా భయమేస్తుంది. నిజంగా భగవంతుడా రోజున మీ యందు దయచూపాడు పూర్తిగా!...ఆఁ! ఇప్పటికైనా మీరెవరో చెప్పరుగా.

కమల్ - నా మాటకేంగాని, రేఖా నా యాక్సిడెంటు దృశ్యము వలెనే వున్నదాయిది. ఆఁ! రేఖ, నేనెల్లా పడిపోయానా రోజు మీ కారు క్రింద!...

రేణు - మూడుమాసాలౌతుంది. యిప్పుడైనా మీరెవరో ఏమిటో, చెప్పాలి. మొదటినుంచీ మిమ్మల్ని నేను గమనిస్తూనే వున్నాను. నేను నా అనుభవంలో మానవ ప్రపంచాన్ని చాలా వరకూ ఎరుగుదును. ఎన్నో నవలలు, కథా పుస్తకాలు, చదివాను కాని మీలాంటి మనఃప్రవృత్తిగల మనిషిని చూడలేదు కనీసం కథల్లోగూడా. మీలాంటి పాత్ర సృష్టించబడలేదు. మిమ్మల్ని చూస్తున్నకొద్దీ మీ గురించి తెలుసుకోవాలనే కుతూహలాన్ని హృదయం ఉటంకిస్తోంది.

కమల్ - అదేం, వెఱ్ఱివేఁళా! నేనేం, పురాణ పురుషుడనా! వీరాధి వీరుడనా! లేక, దేశసేవా దురంధరుడనా! సామ్రాజ్యాధికార పట్టాభిషిక్తుడనా! ఏం! లేదే కళాసేవచేయుచున్న అభిరుచికొద్దీ నేనెంతో గొప్పవాడిని కావాలనే కోరికే నన్నింతకంతకు ముదిచ్చి బొమ్మలా పిచ్చివాణ్ణి చేస్తోంది

రేణు - మీ అపురూప అమూల్య చిత్రకళా విశిష్టతకు నిజంగా మీపేరు ఎంతవరకీ, స్మరణీయంగా, పరిపాటి గావలసిందే! కాని, యీ లోకం యీ సంస్కృతి, స్వార్థోద్రేక ప్రవృత్తిలో లీనమైపోయున్నై. లోకానికి, సత్యాన్ని గుర్తించే కళ్ళులేవు వ్రాసిన భావాలు. వ్రాసినపోకడల్లో అడుగులకు మడుగులొత్తేవారికే, భాగ్యభోగాలు, పేరు ప్రతిష్టలూ, నిరంకుశాధికార స్వతంత్ర విహారాలు, నిత్యజీవిత వైభోగాలు, కమ్మనిస్వేచ్ఛా వాయువులను పీల్చడం వీళ్ళకు చేతకాదు...అది మన దురదృష్టం...

కమల్ - నిజమంతే. ఎవరి అదృష్టాన్నెవరు తీసుకోగలరు... ఆత్మాభిమానాన్ని కదుపబెట్టి, ఐశ్వర్యాంధ కారంలో పడి తెంకలవటంకంటే, అభిమాన రక్షణకు ఆత్మసమర్పణ చేయుటమే కళారాధకులకు గీటురాయి.

రేణు - అవును, అందుకే, నీ కళాదేవతను, యీ స్థితిలోనికీడ్చుకొచ్చాన్! అది కేవలం మీ స్వయంకృతాపరాధమే. అయినా ఆనాడు మరుగియున్న లోపం కాలాభిరుచి, అభ్యున్నతైన మీకు అనుకోకుండా లభ్యమైనందుకు, తీర్చిదిద్దుకునే అవకాశం అమరింది. అనుగ్రహించాలి మీరు. ఇకెవరికీ యీ కలకత్తానుంచి వెళ్ళటానికి వీల్లేదు.

కమల్ - తప్పకుండా, ఎంతకంటే కావాల్సిందేముంది! కాలము గడుస్తుంది, నీకు నేర్పినవాడనౌతాను. కానీ, ఆతర్వాతైనా, నే వెళ్ళటానికి అడ్డు చెప్పకూడదు.

రేణు - అలాగే ముందు, కళాదర్శనీయమైన హంపీక్షేత్రంలో, చిరస్మరణీయమై, శిథిలావస్థలో, జీర్ణమగుచున్న వాటి గురించి, చెప్పండి.

కమల్ - (ఆలోచనగా) ఎండిన చెట్లు, శిథిలమై...నిర్జీర్ణమైన విగ్రహాలు, బక్కచిక్కిన నిరుపేద ఆశాసౌధాలను, అంతరాస్తులుగా పేర్చుకొని, ఒక్కసారిగా కూల్చుకుని కుములుతున్న నిర్భాగ్యుడు ... తెలివియా... కాసంతకుంకుమకోసం లోకంలో సృష్టియందు మహా పతివ్రతయై, చేసుకున్న భర్తను మోసగించే రంగీలా జవానీలు, వీట్లమీదకు మాత్రం నా మనస్సు పోదు.

కండి! శక్తికొలదీ మీ కాలాన్ని ఇతరులకు, సర్వస్వరూపంలో సహాయం చేయడానికి వినియోగించండి! వాస్తవంగా, మీ రేదో అంతర్భూతమైన వ్యథతో బాధపడుతున్నట్లు ఘట్టిగా తెలుస్తోంది ఎన్నివిధాల ప్రయత్నించినా ఆ రహస్యం మాత్రం మీనుండి తెలుసుకోలేకపోతున్నాను

కమల్ – అంతర్భూతమైన వ్యథ... అంతర్భూతమైన వ్యథ...
(మరో ప్రక్కకు పోవును)

రేణు – పాట. నిరాశ చెందకురా – నిరాశ చెందకురా
నిరాశ చెందకురా ॥నిరా॥
తరమా తెలియను – తరుణీహృదయము
ఉన్నతమౌరా – హిమగిరికంటె
గంభీరమురా – సాంద్రముకంటె ॥నిరా॥
గర్వితమతివై – కనుగానలేక
సర్వజ్ఞతతో – సంచరించెదవు
సర్వము మించిన – బలహీనుడవై
నిర్విశేషతను – గ్రహియెదవు ॥నిరా॥

(పాడుతూనే లోనికిపోతుంది. ఆవైపే చూస్తూ కమల్ స్టేజీపై నిలబడివుంటాడు, రెండోవైపున తెరలో పిచ్చివాడిపాట వినిపిస్తుంది.

పిచ్చి – పాట. నమ్మకురా నమ్మకురా
వనితాజనమును – నమ్మకురా ॥నమ్మ॥
మాయమాటలను – మమతను గొలిపి
మరుగుచేష్టలను – సాగించెదరూ ॥నమ్మ॥

రాజా - తప్పు తెలియక మాట్లాడటం తగనిపని కమల్...

కమల్- ఎటువంటిది తగనిపని, ఏది తగనిపని, ఎవరిదా తగనిపని ఆలోచించండి యోచించండి. స్వార్థోద్రేక పరాయణులై పరంపరాధికార దౌర్జన్య పరితాపనయంత్రులై కపట నాటక నటనా దురంధరులై తేనెపూసిన కత్తిలా తిన్నింటికి చిచ్చు పెట్టి కన్నకడుపును మసిపూసి గద్దెలెక్కి గర్జించటం తగనిపని తెల్సిందా యిప్పుడైనా!

రాజా - కమల్ ఏమిటా అర్థంలేని మాటలు. ఏమిటా ఒళ్ళు తెలియని శివం ఏమిటా నోటివంకర కూతలు! కామోద్రేకానికి కట్టుబడి దుర్వ్యసనాసక్తతకు లోబడి కట్టుకున్నదాని బ్రతుకు గంగలో కల్పి కన్నతల్లి మానాన్నికూడా లెక్క చేయక...

రేణు - (కాఫీ తెచ్చి నిర్ఘాంతపడి నిలబడుతుంది)

రాజా - (రేణుని చూచి తిరిగి కమల్‌తో) భోగస్త్రీలోలతను పొందుచుండి పోటుమాటలతో పెద్దలను నొప్పించటమేనా నీవంశ సాంప్రదాయకపువాసి ద్రోహం చేసినతప్పుకు సిగ్గు పడక...

రేణు_ (చేతులోకప్పు జారుతుంది)

కమల్ - ఎవరు ద్రోహులు ద్రోహమెలాంటిది అసలు ద్రోహ శబ్దార్థం తెలుసా నీకు దేశగౌరవాన్ని, జాతిగౌరవాన్ని వంశ గౌరవాన్ని, కుటుంబగౌరవాన్ని ఆత్మగౌరవాన్ని తమ తమ అక్రమాడంబర జవిసితులకు ఆహుతిచేయటం ద్రోహం

